Saraswata Niketanam

సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితో సహా) Reg. No M 3766

సంపుటము 32 సంచిక 5

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

ఆగష్టు 1943

Saraswata Niketanam,
VETAPALEM

సంపాదకులు

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు.

శ్రీయుత ఏదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్ :— గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore

# విషయసూచిక



# ఆంధ్రరాష్ట్ర ప్రారంభ విద్య

**ANDHRA RASTRA PRARAMBHA VIDYA**

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 32 | ఏలూరు 15 ఆగష్టు | సంచిక 5 |
| --- | --- | --- |




## నిత్యసంకీర్తనము

**వివరణము .**

భగవంతుడు మనము చేయుపనులను జూచుచుండును. బిగ్గరగ ప్రార్థనము చేసినంత మాత్రమున మోసపోడు. ఆయనను జేరవలెనన్న హృదయము పవిత్రము కావలెను. విశ్వాసముండవలెను. అచంచలమగు మానసిక దీక్షయుండవలెను. ఆధ్యాత్మిక విషయమున గుణింతము, గణితము పనికిరావు. సరళత, సామాన్యతలు మాత్రమే రాణించును. డాంబికత యేమాత్రమును బనికిరాదు.

**సంకీర్తనము:**

1. అనుక్షణ మెవ్వరి యాగమనమును నిరీక్షించుచున్నారో అట్టి సర్వాంతర్యామి నా హృదయమును బవిత్ర మొనర్చును గాక !
2. నా హృదయము భగవంతుని స్థిరనివాసయోగ్యమగుచు గాక !
3. అనుక్షణ మాయన నామసుధారసమును గ్రోలుచు నిరపాయముగ నుందును గాక !

—స్వామి రామతీర్థ

# దైవప్రార్థనము

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య

తే॥ గీ॥ నిఖిల జగముల సృష్టించి నిలుపనీడ
యైన లేకుండ నిల్చిన యట్టివాఁడ
భక్తి సంబద్ధ ప్రేమ ప్రభావమూర్తి
వాంఛితార్థ ప్రదాత దేవా నమస్సు.

సీ. కుముదరాజిని జీల్చుకొని యేగుదెంచెడు షట్పద ఝుంకార సమితిలోన,
లేమావి జిగురుల లెస్సగా మెక్కిన శుకపిక శారికా సుస్స్వనముల,
చలమూని యొండొంట సయ్యాటలాడెడు విశ్వావారాశి సంవీచికలను,
మినుకు మినుకని లేచి వినువీధిఁబయనించు కమనీయతార కాగణమునందు,

తే॥ గీ॥ బానమగు స్వామి నీదువిలాసగరిమ
నిశ్చలంబగు నామనోనిలయమునందు
స్థిరతరంబుగ మూర్తి ప్రతిష్ఠజేసి
పూజసేయుదు, కొనుమోయి పుణ్యపురుష !

తే॥ గీ॥ దేహ కోసలరాజ్య సందీప్తమగుచు
నున్నతిం గన్న హృదయ యయోధ్యయందు
ప్రకృతి వైదేహితోడుత ప్రమదమంది
పట్టమును గట్టుకొమ్ము కృపార్ద్రచిత్త !

ఉ॥ పారము లేని పెన్వెతలు పైకొని రేగుచు చుట్టుముట్ట సం
సారపయోధిఁజిక్కి దివసంబుల నెట్టెటొ వెళ్లబుచ్చుచుఁ
జేరి స్మరింపఁడించుక యుసీ! మదిలో నిను దేవదేవ! సం
చారపరీతమీ బ్రతుకు శాశ్వతమంచు నహంకు మూర్ఖుడై.

సీ॥ పెనురాతిలో కప్పఁబెటుగంగఁజేసెడి యవకాశమొదవించు నద్భుతంబు
ఒకప్రాణి కొకప్రాణి నోగిరంబుగఁజేసి కాలంబుగడపించు గట్టితనము
పిన్న విత్తనమునఁ బెనుపెను మఱ్ఱుల సృష్టిగావించెడి నునిశితంబు
సంద్రముల్ భూమిపైఁజనకుండ కట్టడ గావింపగా నధికార బలము

తే॥ గీ॥ అమృత మయమైన కవుల కలంబునందు
మధు మధుర భావనలఁజిమ్ము మహితశక్తి
స్వామి ! నీయందె లీనమై వరలెనేమొ ?
అర్పణము సేతుఁ గొనుము జోహార్లు నీకు.

చ॥ తమకము లేని మానసము తాలిమి మీఱ విపత్తులందును
ప్రమదమునందు ధైర్యతతి రాజసమెంతయు లేక సాత్త్వికం

,బమరిన జీవితంబు భవదంచిత కీర్తి ప్రభావిశేషముల్
విమలవితాన పేర్మిమమున విశ్రుతిఁజేసెడి భాగ్యమీయవే!

సీ॥ హా! ఎట్టివింత బ్రహ్మాండమంతటిలోన మనభూమి యొకపరమాణువంట
సర్వసర్వం సహా సాగరశ్రేణులు దూటెడు సలిలంపుతుంపరంట
వెలుఁగొందు నట్టి యీవిశ్వ తేజంబెల్ల మిణుగురు కాంతికి మించదంట
ప్రళయార్భక మహా ప్రభంజన తతులెల్ల రహి వీచుమరుదంకురంబులంట

తే॥ గీ॥ ఒక్కటే కాదు పదియు నాల్గున్నవంట
లోకములు నీదు కడుపులో మూకలగుచు
వానిలోనను లీనమై వరలెదంట
అహహ! నీలీల లెంత యత్యద్భుతములు!

తే॥ గీ॥ సాధుచిత్తంబులకు పరీక్షలనుజేయఁ
గష్టములఁగూర్చి, వానితో క్షమయునిచ్చి
మహితమోక్ష మొసంగిన మాయలోక
నాటకపు వేసగాడ! ప్రణామశతము!

---

# బా లా జీ

కవికిశోర & బాలకవి ఓలేటి - పంచముఖేశ్వరరావు & సుబ్రహ్మధర్మారావు

క. శ్రీతిరుపతి పురవాసా!, ఆతపకరభాస! సంతతార్చితదాసా!
శ్వేతప్రసూనహాసా!, వీతాఘా! ఉద్విలాస! వేంకటరమణా!

క॥ శనివారము నీభజనలు, ఘనభక్తిని జేయుచుండఁగా మము దయతో
మనుపఁగ రావేలా? స, ద్వినుతగుణా! పద్మచరణా! వేంకటరమణా!

క॥ అలమేలు మంగనాథా!, చలమెందుకు జేసెదీవు సాకఁగదోయీ!
లలినీ భక్తులఁ గావుము, విలసిల్లెదు కరుణతోడ వేంకటరమణా!

క॥ వడ్డీకాసులవాఁడా!, జడ్డితనము మాన్చువాఁడ! చక్కనివాఁడా!
గిడ్డివి బీదలపాలిఁట, బిడ్డలు గౌడ్రాంధ్ర కిచ్చు వేంకటరమణా!

క॥ జాలం బేలామేలా, పాలింపగ రాగదయ్య భక్తుల దయతో
బాలాజీ! క్రూరజనా, భీలా! దీనార్తిపాల! వేంకటరమణా!

క॥ శేషాచలవాసా! రిపు, భీషాభక్తప్రపోష! ప్రేమవిశేషా!
భూషా! బుధతోషా! శుభ, వేషా! భవపంకశోష! వేంకటరమణా!

క॥ ఆరాధించుచు నిన్నున్, గోరెదము వరంబు లేఁడుకొండలవాఁడా!
ఈరాదా? మాకోర్కులు, పేరిమితో పాపహరణ! వేంకటరమణా!

(సశేషము)

---

# భ ర త మా త

చిలకా వేంకటకృష్ణదాసు

సీ. శ్రీమణినిలయంబు సింహళద్వీపంబు । వజ్రస్థగిత హేమపాదపీఠి
వివిధధాతుసమేత వింధ్యమహీధరం । బనుపమ రత్నసింహాసనంబు
అత్యాయతోన్నతమై చెలంగు హిమాద్రి । పార్థివచిహ్నమౌ పట్టుగొడుగు
రమ్యవీచీలస త్ప్రాక్పశ్చిమాంబుధుల్ । సమ్యగ్వరాజ వింజామరములు
గీ. నై చెలంగ నతంబు గటాక్షవీక్ష । ణంబులం గారవించు చన్య నృపవర్గ
సంస్తుతచరిత్రవై యొప్పు జనని ! నాదు । భ క్తినతి గొని దీవింపు భరతమాత !
సీ. కడు పావనంబైన కైలాసశిఖరంబె । నీ యున్నతత్వంబు నెఱి వచించు
జాహ్నవీ యమునోర్మి సంసక్తజలమె నీ । ప్రవిమలత్వంబును పఱపుచుండు
కాశీ ప్రయాగ రామేశాది తీర్థముల్ । నీదివ్యచరితంబు నూదిపలుకు
తాజమహల్ ముఖ్యరాజితదృశ్యముల్ । తఱమైన నీభాగ్యనుతి యొనర్చు
గీ. ఐన నీబిడ్డ లెందరో యన్నవస్త్ర । హీనులై యలమటపడ హేతువేమొ
ఎఱుకపడకుండె నీకొఱ యెట్లుదీరు । భవ్యశోభాసమేత యోభరతమాత !
సీ. బదరికా నైమిశ పావనభూములన్ । సిద్ధికై ఋషులు చేసినతపంబు
అనుపమంబౌ యెల్లొరాజంతగుహాలలో । నియమాన మునులు పూనినతపంబు
గురుతర హిమశైలగుహాలలో నీశ్వర । ప్రీతిగా ఋషు లొనర్చినతపంబు
దండకారణ్య సుందరవనంబులలోన । నిష్ఠతో మునులు పూనినతపంబు
గీ. జనని ! యేమాయె నాతపశ్శ క్తియెల్ల. । జాలకున్నదె! యన్నవస్త్రములు లేక
యలమటించు నీబిడ్డల యార్తిఁ దీర్ప । భవ్యగుణమాతృకదంబ ! భారతాంబ !

---

## భారతమాత

(కె. ఎ. స్వామి, శ్రీకాకుళం).

బేహాగ్ ఆదితాళము

భారతమాతా ! భాగ్యోపేతా !
ధీరపురుష బహు వీరసమేతా ! ॥భారత॥
1. శుభ్రజ్యోత్స్న యశఃపరిపూతా సుందర । వన ఫల పుష్ప సమేత॥భారత॥
2. సర్వభాష సంస్తుత సుభచరిత, సర్వదేశ । సన్నుతగుణ మహితా!
సర్వకాలముల నీ నామంబే స్మరించెద। మది సద్గుణభరితా! ॥భారత॥

---

# బాలనీతిశతకము

## దశమదశకము

## కవి - కవనము - కృషి.

(గత సంచిక తరువాయి)

బాలకవి : వాకాటి పెంచలరెడ్డి

తే. గీ. కవితఁ జెప్పెడునాతండు భువనహితుఁడు। అతనిసత్కీర్తి జగములో సతతముండు
కాన కవిరాజు మించిన ఘనుఁడు లేఁడు। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 1

తే. గీ. భువికి మూఁడవనేత్రంబు కవన మరయ। దాని కెయ్యెడ నాశ మెద్దాన లేదు
దానిరచయిత మృతుఁడయ్యు ధన్యతముఁడు। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 2

తే. గీ. మంచిచెడ్డల నెఱిగించు మహితశక్తి। నీతియుతులను జేయు ననింద్యశక్తి
లలితకవిరాజుకవనంబు కలుగఁ జేయు। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 3

తే. గీ. నవరసంబులఁ గురిపించు నవ్యభంగి। అందు ముగ్ధులఁ గావించు నఖిలజనుల
సరసకవనంబు మోహనాస్త్రంబుగాదె!। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 4

తే. గీ. తరణిచంద్రులు నెందాఁక దనరువార। లన్నిదినములు సత్కవీంద్రాత్మ జగతి
వంద్యమై గణ్యమై కడు ప్రభలమించు। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 5

తే. గీ. ఎదను దలపోసి యత్నంబు లెవఁడు సేయు। వానికార్యంబులన్నియు ఫలితమిచ్చు
మొదలకుండెడు వాని కేమియును లేదు। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 6

తే. గీ. యత్న మొనరింపకుండిన నబ్బఁబోదు। ఫలితమించుమంతయేనియుఁ బ్రజకు నెపుడు
యత్నహీనుండు నిర్భాగ్యుఁడైననరుఁడు। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 7

తే. గీ. లక్ష్మి యత్నించువానినే లలితదృష్టిఁ। గాంచు నవ్వానినే ప్రేమఁ గౌగలించు
నన్యు నెప్పుడు దారిద్ర్యమందు మునుఁగు। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 8

తే. గీ. విఫలమైనను యత్నంబు విసిగికొనక। పెల్లుమీఱిన యుత్సాహవిధినిఁ జేయు
ఫలిత మెప్పటికైనను గలిగితీరు। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 9

తే. గీ. సత్ప్రయత్నంబులకు హరి సాయపడును। లోక మెల్లను హర్షించి లోఁగియుండు
దుష్టయత్నంబు లెపుడైన కష్టమొనఁగు। సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 10

(సర్వము సంపూర్ణము)

మరా:— నా రచనలయందలి 'బాలనీతిశతకము' సర్వమును తమ పత్రికాముఖమున గౌరవాదము లతోఁ బ్రకటించి తమ్ములమునఁ బాఠకలోకమునకును, నాకును నానందము గల్పించిన విశాల హృదయు లును, భాషాభిమానులునగు 'ఆంధ్రరాష్ట్ర పారిరంభవిద్య' పత్రికాధిపతుల యెడ నెంతయు కృతజ్ఞుడను.

ఇట్టి వీరియాదరణవలన పాఠకలోకమునకును నాకును చిరకాల సంబంధము సర్వవిధముల నేర్పడునని యన్ని విధముల విశ్వసించుచున్నాడను

రాబోవు నెలనుండి యీ పత్రికాముఖమున బాలురకు, నుపాధ్యాయులకు నుపకరింపఁదగిన 'విద్య నీతి కథావళి' ని ప్రకటింతును.

ఈ పత్రిక చిరస్థాయియై యాంధ్రదేశమునకింకను వన్నెఁదెచ్చుగాక యని పరాత్పరుని ప్రార్థించుచున్నాడను.

ఇనుకపాళెం }
24-7-1943. }

ఇట్లు,
వాకాటి పెంచలరెడ్డి.

---

## విద్యాప్రచారపు పాట.

బాలకవి, ఏ. వి. రాఘవయ్య.

("హిందు ముసల్మానులెల్ల ఏకమవాలీ" వరుస)

1. భారతీయ బాలులెల్ల బడికి పోవాలీ
బడికి వెళ్ళి విద్యలన్ని బాగ నేర్వాలీ ॥భారతీయ
2. ఆట పాటలన్ని వేగ ఆపివేయాలీ
జ్ఞానవంతులగుటకునై చదువు నేర్వాలీ ॥భారతీయ
3. గురు వృందు భయభక్తులు కలదురుకోనాలీ
ఆ యొజ్జ సెప్పు చదువులన్ని యొగిని నేర్వాలీ ॥భారతీయ
4. నాగరికత జెందు విద్య నభ్యసించాలీ
భావి పౌరుడై దేశము బాగు చేయాలీ ॥భారతీయ
5. దేశ దేశ వార్తలన్ని తెలిసికోనాలీ
దేశభక్తుడై నిరతము దీప్తి జెందాలీ ॥భారతీయ

(Copy right to the Author.)

---

# భూగోళ ప్రశ్నోత్తరములు

5 వ త ర గ తి

తాతా జగన్నాధరావు, హెడ్మాష్టరు. బోర్డుఎలిమెంటరీ స్కూలు, కొంత్యాం;
కీ. శే. వేదుల అన్నయ్యశాస్త్రిగారు.

(Copy right to the authors)

(1943 సం॥రం మే నెల తరువాయి)

N. B:—(యీ ప్రశ్నోత్తరములు చాలకాలము క్రిందటనే తయారు కాబడినను కొన్ని అనివార్య కారణములచేతను, తే 9—7—43 దిని శ్రీ వేదుల అన్నయ్యశాస్త్రిగారు కాలధర్మము నొందుటచేతను, జూన్, జూలై మాసములలో పత్రికకు పంపజాలనందుకు క్షమింపప్రార్థన)

Syllabus Heading :—:—iii a. B.:— ఇంగ్లాండులో వ్యవసాయము.
నాలుగు ఋతువుల ననుసరించి.

51. బ్రిటిష్ దీవులలోని వ్యవసాయ భాగములెన్ని ? అవి ఏవి ? అందే భాగమున గోధుమపంట కనువగు పరిస్థితులు గలవు ?

జ: బ్రిటిష్ దీవులలోని వ్యవసాయ భాగములు మూడు. ఇంగ్లాండులోని తూర్పుమైదానము, మధ్యస్కాట్లండు, మధ్యఐర్లండు. ఈ మూడింటిలో మధ్యఐర్లండు నందు వర్షమధికము. మధ్యస్కాట్లండులో ఉష్ణము చాలతక్కువ. తూర్పు ఇంగ్లాండు మైదానమున వర్షము తక్కువగా నున్నది. వేసవులు మిక్కిలి వెచ్చగానుండును, మంచి నేల, కొలదిగవర్షము, తీక్ష్ణమగు సూర్యరశ్మి, యిచ్చటనుండుటచే తూర్పుఇంగ్లాండు మైదానము గోధుమపంటకు తగియున్నది.

52. ఇంగ్లాండులోని కాలములకును, ఇండియాలోని కాలములకును భేదమేమి ?

జ: మనదేశములో ఎండకాలము, వానకాలము, శీతాకాలము అను మూడే కాలములు. కాని ఇంగ్లాండులో వసంతకాలము (జనవరి, ఫిబ్రవరి, మార్చి Spring వేసవి (ఏప్రిల్, మే, జూన్ Summer) ఆటమ్ (జూలై, ఆగష్టు, సెప్టెంబరు-Autumn శీతకాలము (అక్టోబరు, నవంబరు, డిశంబరు-Winter అని నాల్గుకాలములు గలవు.

Syllabus Heading iii a. ) 4 శీతకాల వర్షప్రదేశములు.
a. కాలిఫోర్నియా పండ్లతోటలు పండ్ల డబ్బాలలో నెత్తుట.

53. కేలిఫోర్నియా లోయ ఏ ఖండములోనిది ? అచట ఫలజాతులు పెరుగుటకు గల వసతులేవి ?

జ: కాలిఫోర్నియా లోయ అమెరికా సంయుక్తరాష్ట్రముల పశ్చిమ భాగమున పర్వతములమధ్యగా నున్నది. దీనియందు రెండునదులు ఉత్తర దక్షిణములుగా ప్రవహించును. గోల్డెన్ గేటు అను ద్వారమువద్ద కలియుటచే ఆ నదులు తీసుకొనివచ్చు మట్టివల్ల నేల మిక్కిలి సారవంతమైనది. శీతకాలమున వర్షము పడును. వేసవులు వేడిగానుండును. అందువలన ఇచట పండ్లతోటలకు మిక్కిలి అనుకూలముగా నున్నది.

54. ఈ పండ్ల జాతులలో ప్రాముఖ్యమైన రకములేవి ?

జ: ఈ పండ్లలో ద్రాక్ష, ఆపిల్, నారింజ, నిమ్మ, ప్లమ్, పీచ్, పియర్, అక్రూట్ అత్తి మున్నగు రకములు గలవు.

55. ద్రాక్షపంటకు కేంద్రస్థానమేది ?

జ: ఫ్రెస్నో.

56. కేలిఫోర్నియా రాష్ట్రమునకు రాజధానియేది ?

జ: సేన్‌ఫ్రాన్‌సిస్కో. ఇది జగత్ప్రసిద్ధి చెందిన రేవు.

57. కాలిఫోర్నియా లోయయొక్క శీతోష్ణస్థితి కేమని పేరు ? అదెట్లు గల్గెను ?

జ: మధ్యధరా శీతోష్ణస్థితి యనిపేరు. మధ్యధరా సముద్రప్రాంతములందెట్టి శీతోష్ణస్థితి గలదో యిట్టి శీతోష్ణస్థితి లక్షణములు గల ప్రతి భాగముయొక్క శీతోష్ణస్థితి నా విధమైన శీతోష్ణస్థితి యందురు.

Syllabus Heading:—iii a) 4 b; మధ్యధరానసముద్రతీరప్రదేశములు.

58. మధ్యధరా సముద్ర శీతోష్ణస్థితి లక్షణములెవ్వి ?

జ: మధ్యధరా సముద్రప్రాంతములు 30°, 40° అక్షాంశముల మధ్యనున్నవి. వీనికి శీతకాలమునందు పడమటగాడ్పులవల్ల వర్షముండును. వేసవికాలమునందు వీచు తూర్పుగాడ్పులవల్ల వర్షముండదు. శీతకాలమున ఉష్ణము సామాన్యముగా నుండును. వేసవిలో వేడిగానుండును.

59. మధ్యధరా సముద్రమనగా నేది ? దానికాపేరెట్లు వచ్చినది ?

జ: యూరపునకు దిగువను, ఆఫ్రికాకుత్తరమునను, వ్యాపించియున్న సముద్రము మధ్యధరానసముద్రము. భూభాగములకు మధ్యగా నుండుటచే మధ్యధరా సముద్రమని పేరుగల్గెను.

60. మధ్యధరా సముద్రప్రాంతమునందలి వృక్షజాతులేవి ? ఇచ్చటి ముఖ్య పరిశ్రమవేది ?

జ: ఈ ప్రాంతమున ఫలజాతులు విస్తారముగా పెరుగును. మల్బరీచెట్లు పెరుగును. ఈ ప్రాంతములందు గడ్డిమైదానములు తక్కువగుటచే పశుపోషణలేదు. పండ్లపరిశ్రమ యీ ప్రాంతముల ముఖ్యపరిశ్రమ.

61. మధ్యధరా సముద్రశీతోష్ణమును గల్గియున్న ప్రదేశములేవి ?

జ: స్పెయిన్, ఇటలీ, బాల్కన్‌ద్వీపకల్పము, ఆసియా మైనరు, ఈజిప్టు, వాయువ్య ఆఫ్రికా.

(సశేషము)

---

# బుద్ధిబలము.

రచయిత: మేడూరి ఉమామహేశ్వరం.

చ॥ మును ధరణీశ్వరుండొకఁ డభూతపరాక్రమశాలి నాటి సా
టి నృపుల రాజ్యముల్గొని, గడించి యశంబు, నిజోల్లగంబునం
దున నరిలేని భాగ్యములతోఁ దులఁదూగుచు రాజ్యపాలనం
బు నొనరఁ జేయుచుండె సచివుం డుచితంబుగఁ దన్నుఁ గొల్వఁగన్. 1

కం॥ ఈవిధి తనతూనతి సుగ్రీవాజ్ఞగ మెలఁగు ప్రజలక్షేమమును గనుచున్
భూవిభుఁ డొకదినమునఁ గనెఁ బావని శుభలక్షణాంగిఁ బ్రగ్గడభార్యన్. 2

కం॥ కని కామాంధుండై యా వనితను జేపట్టఁ గలయుపాయము నపుడే
మనమునఁ దలపోయుచు మంత్రిని రాఁ బిలిపించి యిట్లు దెల్పం దొడఁగెన్.
కం॥ చదరంగమాడ నీ కో నునయించెద సోకెక్క పందెముండఁగవలె న
ద్యాది వినుపించెద వినుమని హృదయము తేక్కించ వాని కిట్లని పలికెన్.
ఆ॥ వె॥ గెలుపు నొందవాఁడు గెలువని వానికి కరిగి చేయి హా స్తముననో
యదియు వానికిచ్చి యనుపగావలె నుమ్మ్ల బాస తప్పరాద దోసచిపుడ.
తే॥గీ॥"అనుచు పల్కుచు నుల్లము మంత్రి యాజ్ఞ నను గ్రహించుచు ప్రగ్గడ "యుష్మ గలిగె"
నంచు తలపోసి పైకి మాటాడ వెఱచి యాట నాడంగ మొదలిడె నధిపుతోడ.
తే॥గీ॥చిత్త మాందోళ మొదగ నేర్పుఁ దక్క యామమంత్రి గట్టె యాటేమి మగల
సంతసించుచు లోనఁ దాఁ జనియె నంత చింతఁ గుందుచు మంత్రియుచేరె నిల్లు.
ఆ॥వె॥ ఇల్లుఁ జేరి మంత్రి యిల్లాలి కీ వార్త తెలియఁ జెప్పి బుద్ధి బలము జూపి
నొందుపాయ మంత యూహించి యటపైని భర్త నచె తనదు భార్య నపుడు.
కం॥ ఆమఱునాఁ డుదయంబున భూమీధవుఁ డచటి కరిగి పూర్ణమనముతో
నామెను గొనిపోవఁ జెను నేమో నా తలఁచుచుండె నిట్లుండఁగాన్.
ఆ॥వె॥మంత్రి కాంతనుండ మహినాథుఁ డిల్లంత వెదకి నాఁడు పెదవి కదపకుండ
నాతిజాడఁ గనక నీతిమాలిన రాజు "అటక నెక్కవలె" నటంచు బలికె.
కం॥ అని చింతనున్న నిచ్చెన నను పున నెక్కంగఁ దలఁచి హా స్తంబున ని
చ్చెన నూదిపట్టి: మంత్రియు జననాయక! రంపు దీనిఁ జయ్యాని నిత్తున్.
కం అని పలుకు నయ్యమాత్యునిఁ గని తన యవివేకమునకుఁ గటకట పడుచున్
జని నిజసౌధంబున కిలఁ గనుగొన ధీశక్తివలనఁ గానిది కలదే !

---

# భూగోళ పాఠములలో ఉపకరణములు తోడ్పడు విధానము

చేటూరి సదాశివరావు, బి.ఏ., బి.యిడి., హెడ్మాష్టరు - గవర్నమెంటు హైస్కూలు -
మెండెంఖల్లు (పార్వతీపురంఏజన్సీ)

పూర్వకాలములో భూగోళపాఠములు పరికరముల సహాయములేనిదే బోధింపబడు చుండెను. పూర్వము జరిగిన కొన్ని పనులను,ఏవో కొన్ని పేర్లను పిల్లలకు చెప్పుట అలవాటుగా నుండెడిది. భూగోళశాస్త్రముయొక్క ముఖ్యమగు పనియేమిటో తెలియ కొనలేక బాలురు ఆశాస్త్రములోని పాఠములను కేవలభూతమువలె నున్నదని తలంచుచు, ఆపాఠము లన్న ఉత్సాహములేక యుండెడి వారు. కాని రానురాను భూగోళపాఠములు బోధించుటలో మార్పులు కొన్ని వచ్చెను.

భూగోళమన్న భూమిని వర్ణించుటయే గాక, "భూమికిని, మనుజానకును, గల సంబంధము" అను ఉద్దేశ్యముతో బోధింపబడుచున్నది. భూగోళపాఠముల బోధించుటలో నూతనోద్దేశములతోపాటు, నూతన పద్ధతులుకూడ, అమలులోనికి వచ్చెను. బాలుర మానసిక ప్రకృతిలో చైతన్యముకలుగచేయుటకును, వారిలో ఉత్సాహము, కచ్చితమగు అభిప్రాయములను కలుగజేయుటకును, ఈక్రింద వివరింపబడిన ఉపకరణములు ఎట్లు తోడ్పడుచున్నవో చూతము.

గ్లోబు : భూమి ఆకారమును పిల్లలకు తెలియజేయుటకు గ్లోబు చక్కని ఉపకరణము. నల్లని గ్లోబును పిల్లలకు జూపి, రాత్రింబగళ్లు ఎట్లు కలుగుచున్నవో చెప్పిన పాఠమునందు శ్రద్ధ- స్పష్టమగు అభిప్రాయములు, వారికి గలుగును. మరియు గ్లోబు సహాయమున ఈ క్రిందివిషయములకు సంబంధించిన పాఠములను, బోధింపనగును. పూర్వకాలములో పరిశోధకులు మార్గములను ఎట్లు కనిపెట్టిరో, భూమి తనచుట్టు తాను ఎట్లుతిరుగుచున్నదో, గ్లోబు సహాయమున పిల్లలకుబోధింపవలెను. దీనిసహాయముననే కాలములు, ఋతువులు, భూమి సూర్యుని చుట్టు తిరుగుట, భూమధ్యరేఖలకుగల దూరము, ఉత్తర ధ్రువము, దక్షిణధ్రువము, మొదలగు విషయములకు సంబంధించిన పాఠములు బోధింపవచ్చును. గ్లోబు సహాయములేనిచో పిల్లలకు ఈ పైవిషయములుగురించి ఎంత బోధించినను బోధపడుట కష్టము. కనుక ప్రతి ప్రాథమిక పాఠశాలలోను గ్లోబు చాల అవసరము.

(2)పటములు: భావనుబోధించుటలో నిఘంటువు (Dictionary) ఎంత సహాయపడునో భూగోళ పాఠములను బోధించుటలో పటములు అంత సహాయకారిగా నున్నవి. నవీనభూగోళ బోధనాపద్ధతులలో పటముల సహాయమున బోధించుట చాల ముఖ్యమగు ఉద్దేశముగా పరిగణింప బడుచున్నది. ప్రతి ప్రాథమిక పాఠశాలలోను గోడలమీద వ్రేలాడదీయు పటములు చాల అవసరము. ప్రపంచ భూగోళ పటములు, మనదేశపటములు, చాల ముఖ్యము. ఈక్రింది తెలుపబడు విషయములను గురించి తెలుపు పటములుండవలెను. (1) నైసర్గిక స్వరూపములు (2) శీతోష్ణస్థితి, వర్షపాతము, (3) పంటలు, (4) జనసంఖ్య, (5) రాజకీయభాగములు ఈ పటములు జతపరచి వీటిసహాయమును నైసర్గిక పరిస్థితులు, శీతోష్ణస్థితులపై మానవజీవితమెట్లు ఆధారపడి యున్నదో తెలుపదగును. ఒక ప్రదేశములో జనసంఖ్య ఎక్కువ, మరియొకచోట జనసంఖ్య తక్కువ, ఎట్లు కలుగుచున్నదో పంటలు, జనసంఖ్య తెలుపు పటముల సహాయమున బాగుగా తెలుపవచ్చును. పటములను జత పరచి పైవిషయములకుగల పరస్పర సంబంధమును బాలురకు ఉపాధ్యాయుడు చక్కగా బోధింపవచ్చును. పటములను పిల్లలచే పరిశీలింపజేసి, వానిలోని గుర్తులు ఏయే విషయములను సూచించునో, ఉపాధ్యాయుడు బోధింపవచ్చును.

(3) చిత్రములు : ప్రపంచములో ప్రతి దృశ్యమును ప్రతివస్తువును స్వయముగా పరిశీలించుట దుర్లభము. కనుక వాటికి సంబంధించిన చిత్రములనే పరిశీలించుట భూగోళపాఠములలో అవసరము. భూగోళ పాఠములు ఆకర్షణీయముగాను,ఉత్సాహజనకముగాను, ఉండుటకు చిత్రములు చాల తోడ్పడును. నూతన ప్రణాళికలో రెండు, మూడు తరగతులకు కథలమూలమున పిల్లలకు భూగోళమును బోధింపవలెను. ఎస్కిమో పిల్లలు,నీగ్రోజాతి పిల్లలు లాప్లాండు పిల్లలు, స్టెప్పీ భూములలోని పిల్లలను గురించి, బోధించునపుడు చిత్రములసహాయము లేనిచో వానిని గురించి ఎంత చెప్పినను బాలురకు బోధపడదు. పై పాఠములకు సంబంధించిన చిత్రములను మన పాఠశాలలోని బాలురకు చూపి, విదేశములలోని బాలురను గురించి బోధించినప్పుడు ఆ పాఠములలో ఉత్సాహము జనించును. పిల్లల మానసిక వృత్తులలో ఒక విధమైన చైతన్యము కలుగును. వారికి స్పష్టమగు అభిప్రాయములు మనస్సునందు హత్తుకొనును. 2, 3, తరగతులకు నియమింపబడిన కథలకు సంబంధించిన చిత్రములను ఆంధ్రబుక్కుడిపో వారు ప్రచురించిరి.ఇవి 2, 3, 4, 5 తరగతుల బాలురకు పాఠములు బోధించుటలో చక్కనిపుస్తకములు రామా & కో.,వారు ప్రచురించిరి. ఇవిచాల సహాయపడుచున్నవి. మరియు ఈక్రింది విషయములకు సంబంధించిన చిత్రములు పిల్లలకు చూపి బోధించుట చాల సమంజసము. ఆనకట్టలు, కాలువలు,లాకులు, ఇనుప గనులు, యంత్రాలయములు పర్వతప్రాంతపు దృశ్యముల, పెద్దపెద్ద నగరపువీధులు, పాఠములకు సంబంధించిన చిత్రములను చూపి వాటిని వర్ణించి చెప్పగల పదజాలమును ఉపాధ్యాయుడు కలిగి యుండవలెను. అట్టి ఉపాధ్యాయుడు చిత్రముల సహాయమున పాఠములను బోధించిన చిత్రములలో జీవకళ యున్నదాయని పిల్లలకు తోచి, వారిలో ఉత్సాహము కలుగును. పాఠమధ్యమున చిత్రములను చూపిన పాఠమును జయప్రదముగ బోధించుట ఉపాధ్యాయునికి కష్టము. కనుక పాఠప్రారంభమునను, పాఠము బోధించిన తరువాతనో, చిత్రములను పిల్లలకుచూపిన పాఠము జయప్రదముగ కొనసాగును. చిత్రముల సహాయమున పాఠములను బోధించిన బాలుర ఊహాశక్తి పెంపొందును.

(4) మాదిరులు : వీటివలన ,చిన్న తరగతులలో బాలురకు నైసర్గిక పరిస్థితులమీద పాఠములను

బోధించుటకు చాల ఉపయోగపడును. శిఖరముల ఎత్తును తెలుపుటకును, భూమి ఉపరితలమును తెలుపుటకును, కాగితపు ముక్కలతోగాని, బంక మట్టితోగాని, పిల్లలచే చేయించి వారి స్వయంకృషివలననే మాదిరుల సహాయముతో పాఠములను బోధించుట అవసరము. తరగతులలో పటములుపయోగించు స్థితి వచ్చువరకు ఈమాదిరులే చాల ఉపయోగపడును. వీటివలన పిల్లల ఊహాశక్తి వృద్ధిపొందును.

(5) నమూనాలు : విదేశములలో తయారగు వస్తువులనమూనాలను సంపాదించి, వాటిసహాయమున పాఠములనుబోధించిన ఆవస్తువులగురించి స్పష్టమగు అభిప్రాయములు పిల్లల మనస్సునందు హత్తుకొనును. ఉ : జపాను విసనకర్రలు, ఆటవస్తువులు చైనా సిల్కు, ఫ్రెంచి లేసు, మొదలగునవి. పిల్లలు పై వస్తువులను స్వయముగా పరిశీలించుచో ఆవస్తువులు ఎట్లుతయారగుచున్నవో, ఎచ్చటతయారగుచున్నవో మొదలగు విషయములువారికి పూర్తిగా బోధపడును.

(6) చార్టులు : చిన్నతరగతులలో చార్టుల సహాయమున పాఠములను బోధించుట చాల యవసరము. ఛార్టులను పిల్లలచే తయారుచేయించి(Learning by doing) పాఠములను బోధించిన వారికి పాఠములలో శ్రద్ధ, ఉత్సాహము వృద్ధిపొందును. చార్టులలో ముఖ్యములగునవి యేవియన వాతావరణపు చార్టులు, పంటలు, వృత్తులు తెలియజేయునవియు, ఎగుమతులు, దిగుమతులు, తెలియజేయునవి. కాలము ఎల్లప్పుడు ఒకేరీతిగానుండక కొన్నిరోజులు మబ్బులుగాను, కొన్నిరోజులలో వర్షములు కురియుట, మరికొన్నిరోజులలో ఎండలు కాయుట, మొదలగువిషయములను వాతావరణపు చార్టులు తెలుపును. ఈవిషయములను పిల్లలచే స్వయముగా పరిశీలింపజేసి వారిపుస్తకములలో గుర్తింపచేసినచో వాతావరణపు పరిస్థితులు వారికి పూర్తిగా బోధపడును. పైతరగతులలో వీరికి శీతోష్ణస్థితి - వర్షపాతములపై పాఠములు, సులువుగా బోధపడగలవు. ధర్మామీటరు సహాయమున ఉష్ణమును కొలిపించుట బేరామీటరు సహాయమున గాలివొత్తిడిని పరిశీలింప చేయుట,చాలయవసరము. స్థానికపంటలను తెలుపు చార్టులు చిన్నతరగతుల పిల్లలకు అవసరము. విత్తనములు చల్లు కాలము, కోతకువచ్చు కాలము, పంటకు రైతులుచేయు పనులు, మొదలగు విషయములు పిల్లలచే గుర్తింపచేయవలెను. సరకుల ఎగుమతులు, దిగుమతులు తెలుపు చార్టులను పిల్లలచే గుర్తింపచేసినచో వారికి వర్తకవ్యాపార విషయములలో జ్ఞానోదయము కలుగును. ప్రజలవృత్తులను గురించిచార్టులను తయారు చేయించి పాఠములు బోధించిన బాలురలో ప్రజల జీవిత పద్ధతులపై ఉత్సాహము జనించును.

(7) ప్లానులు, డయాగ్రములు : బడి ప్లానులు గ్రామప్లానులు, చిన్నపిల్లలచే గీయించిన వారికి ఆలోచనాశక్తి వృద్ధిపొందును. పెద్దతరగతులలో పిల్లలకు పాఠములు డయాగ్రముల మూలమున చెప్పిన స్పష్టమగు అభిప్రాయములు వారికి ఆ విషయములను గురించి కలుగును. పంటలు, వర్షపాతము, తెలుపు డయాగ్రములు, మొదలగునవి గీయింపవలెను.

(8) మ్యాజిక్ లాంతరు : దీని సహాయమున పిల్లలందరకు ఒక్కమారుగా చిత్రములను ప్రదర్శించుటకు వీలగును. దీనిద్వారా ఈ క్రింది విషయములను బాలురకు బోధింపవచ్చును.

(1) జిల్లాభూములు, కాఫీ, తేయాకులు (2) సైబరుకనుమ, పాపికొండలలో గోదావరి ప్రవహించు దృశ్యముల చూపుట, మొదలగు విషయము పిల్లలు ఈ చిత్రములను మ్యాజిక్ లాంతరుద్వారా చూచిన ఆచిత్రములలో చూపబడిన విషయములను ఆసక్తితో నేర్చుకొందురు. కాని ప్రతి పాఠశాల దీని నిర్వహించుట కష్టము. ప్రతి కేంద్రపాఠశాల యందైనను మ్యాజిక్ లాంతరుతో పాఠములను బోధించిన చాల బాగుండును.

విదేశములలోని ప్రజలజీవిత పద్ధతుల గొప్ప గొప్ప పారిశ్రామిక ప్రదేశములను గురించి పాఠములను చలనచిత్రములద్వారా పిల్లలకు నేర్పిన ఆపాఠములు · చాల జయప్రదముగ నుండగలవు. అన్నిచోట్ల ముచ్చట్లు జరుగుటదుర్లభము. పట్టణములలో నుండువారికి వీలగును. విద్యావిషయిక ఫిల్ములను తెప్పించి పిల్లలకు చూపిన కంటితోను, చెవితోను, పాటుపడుట వలన వారిదృష్టి పాఠములపై కేంద్రీకరింప బడక తప్పదు.

పైని వివరింపబడిన ఉపకరణములే గాక పాఠములలో సందర్భానుసారముగా ఉపకరణములను చేయించి వాటి సహాయమున పాఠములను బోధింపదగును.

---

## బాపూజీ బాలనీతి

యు. ఆర్. లీలావతి

ప్రపంచ ప్రసిద్ధుఁడైన బాపూజీ పల్కులు ఆ బాలగోపాలమునకు ఆదర్శప్రాయములు. కానిలో కొన్ని పద్యరూపమున నీక్రింద పొందు పరుపబడినవి.

— రచయిత్రి

గీ॥ సత్యమును మించుధర్మ మీజగతి లేదు! హింసఁజేయమి జగముల నేలు నెలమి
వీనిరెంటిని జతపర్చి వెలసెనేని! నీదుపదములఁ ద్రెళ్లును నిఖిలజగము.
గీ. పరులదయానందవిముఖుఁడు పశువె యగును! పరుల సౌఖ్యంబు వాంఛించువాఁడె ఘనుఁడు
గాన పరులకు సౌఖ్యంబుఁ గలుగఁజేసి! కీర్తి నార్జించి వెలయుము క్షేమముగను.
గీ. చెడ్డవాయువు రోగాల చెంతఁజేర్చు! మంచి - గాలియు రోగాల మాన్పు నెపుడు
కనుక నీ వెల్ల వేళలఁ గ్రమముతోడ! మంచిగాలిలో బాగుగ మసలవలయు!
గీ. గాలి యన్నము నీరును కచ్చితముగ! జీవనమునకు వలయును చిట్టితండ్రి
అట్లె దేహపరిశ్రమ యవసరంబు! కాన నద్దానిఁ జేయుము కష్టమనక.
గీ. దినదినంబును నడచిన దేహమునను! పారిశుధ్యము సత్వంబు ప్రబలుఁ గాన
తొడరి వ్యాయామ గతులందు నడక మేలు! నడచువారికి బలముంట నృడమి వినమె!

---

## భూగోళ ప్రశ్నోత్తరములు.

(జూలై సంచిక తరువాయి)

వేదాన్తము శ్రీనివాసాచార్యులు - హెడ్‌మాష్టరు - ఆత్కూరు.

[జపానుదేశము - అందలి ప్రజలు - అగ్నిపర్వతములు - మధ్య ఆశియా - పంచసముద్ర ప్రదేశము.]

20. ఆసియాకు తూర్పుభాగమున తీరమువెంటగల రాజ్యమెద్ది?
జ: జపాను. ఇది కురైల్ ద్వీపము మొదలు ఫార్మోజాదీవివరకు వ్యాపించియున్నది.
21. జపాను దేశమందలి ముఖ్యమగు పంటలు - పరిశ్రమలెవ్వి?
జ: వరి, గోధుమలు, తేయాకు పొగాకు, పట్టుపరిశ్రమ - చేపలవేట
22. జపాను పారిశ్రామిక దేశము - కారణములెవ్వి?
జ: 1 ఇచ్చట ఇనుము నేలబొగ్గు, గంధకము, మొదలగు ఖనిజములుదొరుకును. (2) స్వతంత్రరాజ్యము (3) తీరరేఖచీలియున్నది. (4) శీతోష్ణస్థితి. (5) దేశమందలి నదుల వేగమువలన విద్యుత్ తయారగుట.

23. జపానునందు తయారు చేయబడువస్తువులెవ్వి?

జ: అగ్గిపెట్టెలు, గాజు, పింగాణిసామానులు, ఆటవస్తువులు.

24. జపాను దేశమందు నిప్పు పుల్లలపరిశ్రమ హెచ్చు. కారణములెవ్వి?

జ: అగ్నిపర్వత ప్రాంతములనుండి గంధకము తీయబడును. అడవులందు కలప దొరకును. అందుచే ఈ పరిశ్రమ హెచ్చు.

25. జపాను యొక్క మాంచెస్టరనేమి? జరుగుపరిశ్రమ యేది?

జ: ఒసాకాపట్టణము - వస్త్రములనేత, అగ్గిపెట్టెలు, గాజుసామానులు.

26. నాగసాకి పట్టణ ప్రాముఖ్యమేమి?

జ: ఇచ్చట ఓడలుకట్టుట, కాగితములు చేయుట, అగ్గిపుల్లలు, పింగాణిగిన్నెలు చేయుదురు. గొప్పవ్యాపార కేంద్రము.

27. జపాన యొక్క ముఖ్యపట్టణమేది? దాని ప్రాముఖ్యమేమి?

జ: టోకియో. 2 మిలియనుల జనులుగల పెద్దనగరము. విశాలమై సారవంతమగు పల్లపునేలయందు గలదు. ఈ నగరము వెనుక ఫ్యూజియామా పర్వత శిఖరము గాంచబడును. పరిశ్రమలు హెచ్చు.

28. యోకోహామా - ఫార్మోజాలను గూర్చి వ్రాయుము.

జ: యోకోహామా ఓడరేవు. ప్రపంచపు ఓడలరాదారిలో గలదు. 1895 యుద్ధానంతరము చీనానుండి ఫార్మోజాను లాగుకొనిరి. కొండలపై నగల అడవులలో కర్పూరపుచెట్లు హెచ్చు. ఈ దీవినుండి కర్పూరము ఎగుమతి యగును.

29. జపాన-బ్రిటిష్‌దీవులకు గల పోలికలెవ్వి?

జ: తీరరేఖలు చీలియుండి రేవుపట్టణములు గల్గియున్నవి. 2. రెండునసమశీతల మండలములో గలవు. 3. రెంటికి వేడినీటి ప్రవాహములు గలవు. 4. రెండును ద్వీప సముదాయముచే నేర్పడిన దేశములు. 5. రెండును పారిశ్రామిక దేశములు.

30. కొరియా జపానుకు ఎట్లు తోడ్పడుచున్నది?

జ: కొరియాలో పండునరి, బార్లీ - చిక్కుడు, విశేషముగా జపానుకు వినియోగపడును. ఇనుముకూడా వాడబడును.

31. ఫ్యూజియామాను గూర్చి వ్రాయుము.

జ: జపాను దేశములోని అగ్నిపర్వతము. టోకియోనగరమునకు సమీపమున గలదు. జపానువారికి పవిత్రమైనది.

32. జపాను వారిని గూర్చి వ్రాయుము!

జ: వీరు పొట్టిగ నుందురు. చురుకుదనము, పట్టుదలగలవారు. నౌకాయానమందు నిపుణులు. బౌద్ధమతస్థులు. ఇండ్లు శుభ్రముగను, అందముగాను ఉండును. దేశాభిమానము హెచ్చు.

33. ఆసియామధ్యభాగమందు జనసంఖ్య తక్కువకు కారణములెవ్వి?

జ: శీతభూమి-ఎడారిప్రదేశము హెచ్చు. పంటలు తక్కువ.

34. ఆసియా పర్వతశ్రేణులకు పుట్టిల్లు ఏది? వాని నడుమగల పీఠభూమియేమి?

జ: పామీరుపీఠభూమి. క్వెలన్ హిమాలయపర్వతముల మధ్యటిబెట్ పీఠభూమి కలదు.

35. టిబెట్ పీఠభూమిని గూర్చి వ్రాయుడు?

జ: ప్రపంచమందలి పీఠభూములలో గొప్పది. దీనికి ప్రపంచపు ఇంటికప్పు అని పేరు. అతి శీతలముగ నుండును. ఇచ్చట వర్షములు తక్కువ. గోధుమలు, బార్లీ పండును. పశుపాలన ముఖ్యవృత్తి. కొండలమీద బరువు మోయుటకు జడలబఱ్ఱెలు, కంచరగాడిదలు, ఉపయోగింపబడును. కస్తూరి, రాతిఉప్పు ఎగుమతి చేయుదురు. రాజధాని - లాసా - ప్రజలు బౌద్ధమతస్థులు.

36: పంచసముద్ర ప్రదేశములోని దేశములెవ్వి?

జ: ఆసియామైనరు - సిరియా - పాలెస్టైను అరేబియా, మెసపొటోమియా- పర్షియా - అఫ్ఘనిస్థానము.

(స శే ష ము)

---

# కృతజ్ఞత

(సింహా)

ప్రస్తుతములో ప్రపంచమార్థికముగా, దుస్థితియందున్నదనుట చర్వితచర్వణము. అందున భారతదేశస్థితి సార్థకము. అంతర్గత ఉపాధ్యాయలోక అర్థికస్థితి అగమ్యము. అనూహ్యము. గ్రుడ్డికన్నకంటె మెల్లకన్ను మేలుగదా! అట్లనే యీ విశాఖపట్టణ జిల్లాలోని బోర్డు ప్రాథమికోపాధ్యాయులు ఆర్థికదుస్థిని Revise చేయుటకు 1933 సం॥ రంలో Revised Scale ఏర్పాటుచేయబడినప్పటినుండి యీ జిల్లా బోర్డులో అనేక మంది ప్రెసిడెంట్లున్ను, స్పెషలాఫీసరులున్నూ, అధికారములు చలాయించుట, తబ్ తుతిగుటకూడ, జరిగినదిగాని Scale మాత్రము అమలుజరిపించుట కవకాశములను చూరగొనలేకుంటకూడ, అన్నియు ముందునకు మేలుకొరకే అనునట్లు జరిగిపోయినవి. రాను రాను కాలక్రమానుగతముగ రావు బహదూర్ శ్రీ గొట్టుముక్కల జగన్నాధ రాజావారు B. A. B. L. స్పెషలాఫీసరుగా యీ బోర్డున ప్రవేశించిన దాది బీద మాస్టర్లమనశ్శాంతియే ప్రపంచ సౌభాగ్యమునకు పునాదియని భావించి Scale యిచ్చుటకు సంకల్పించి కార్యరూపమునకు తేగోరి వారి అధికారపరిమితి అంతమయి ననూ మాస్టర్ల అదృష్టదేవత గట్టిగ పట్టుపట్టువారినే అధ్యక్షస్థాన మలంకరింపచేసి నందున వారి అధికారమునకు లొంగి స్కేలు రూపకమైన ఇంక్రిమెంట్లను పొంది నందున జిల్లాలోని యావన్మంది బోర్డుసర్వీసు ఉపాధ్యాయులు శ్రీ ప్రెసిడెంటువారికి

కృతజ్ఞత చూపవలసిన బాధ్యులై యున్నందున అందరి ఉపాధ్యాయుల తరపున శ్రీవారికి నాకృతజ్ఞతావందనము లర్పించుచున్నాను.

కాగా!

ఈ యింక్రిమెంట్లు మహాకాటకముగ నున్న యీ దినములలో చాలవరకు సహాయము చేయుననియు, సమయోచితమైనవనియు, చెప్పవచ్చును, కాని కాలమొక్క ఆర్థికదుస్థితినే సాగుచుండినదనుటలో అంతర్గతము కరువును అనగా ధనమున్నను ధాన్యములేకయుంటుటను గల్గియున్నందున ప్రస్తుతపు ఇంక్రిమెంట్లు సహజముగ యీయవలసిన మనోతృప్తిని ఉపాధ్యాయుల కీయజాలకున్నవని పూర్ణముగ సిగ్గువిడిచి వ్రాకుచ్చినందుకు క్షమించెదరుగాక! ఈ యింక్రిమెంట్లను యిప్పించగలిగిన దాతలు శ్రీ ప్రభువులవారు యిటీవలనే ప్రతి యుపాధ్యాయునకు, వానిజీతముల నాధారముపైని, వారి కుటుంబబాహుళ్యములవరుబడిని ఆహారపదార్థముల సప్లయి జరుగునట్లు కూడ ఏర్పాట్లు జరిపించి, పెన్నిధిపొందిన పేద పొందు సంతోషమును కలిగించి ఉపాధ్యాయలోకమువలన కృతజ్ఞతా పూర్ణతను చూరగొనెదరు గాక యనియు ఉపాధ్యాయుల సౌభాగ్యము ఫలించుటకు శ్రీ ప్రభువులవారి ప్రయత్నము లంతరాయము లేకుండ శీఘ్రమార్గముల నీయవలసినదనియు సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

---

# విషాదవార్త

### శ్రీ వేదుల అన్నయ్యశాస్త్రిగారి నిర్యాణము

సుమారు తొమ్మిది వత్సరములనుండి విశాఖపట్నం జిల్లాబోర్డు ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులుగను, మూడువత్సరములు విశాఖపట్నం రేంజిబోర్డు ప్రాథమికోపాధ్యాయసంఘ కార్యనిర్వాహకవర్గ సభ్యులుగను పనిచేసి విశేషకీర్తినొందిన శ్రీ వేదుల అన్నయ్యశాస్త్రిగారు తే 9-7-43 దిని పరమపదమును చెందిరని తెలుపుటకు మిగుల చింతిల్లుచున్నాను.

వీరు భీమునిపట్నంలో 1911 వ సంవత్సరమున జన్మించి, విద్యాభ్యాసాది విజ్ఞానమచటనే అలవరచుకొని, ఉపాధ్యాయ ట్రయినింగు 1934 లో నొంది, వివిధ తాలూకాలలోని పాఠశాలలలో ప్రధానోపాధ్యాయులుగ పనిచేసితుదకువిశాఖపట్నం తాలూకా గురమ్మపాలెం బోర్డు ఎలిమెంటరీ స్కూలు ప్రధానోపాధ్యాయులుగ పనిచేయుచు విశేష కీర్తినొంది వీరు జీవయాత్రచాలించిరి.

ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా మాసపత్రికా పాఠకులెల్లరకు వీరుచిరపరిచితులే. 1941 సం॥ రం డిశంబరు నెలనుంచి వీరిచే రచింపబడిన 4,5 తరగతుల హిష్టరీ, సివిక్సు,

నేచర్ స్టడీ ప్రశ్నోత్తరములు, భూగోళపాటలు ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల యుపయోగార్థమై ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా మాసపత్రికలయందు ప్రచురింపబడి యున్నవి. ధైర్య సాహసములందును, తలచినదానిని వెనుకంజవేయక చేయుటలోను, ఔదార్యాది సద్గుణములు కనబరచుటయందును, నిష్కల్మషహృదయముతో యితరుల లోపములనెంచి, సవరించుటకు ప్రయత్నించుటలోను, అవసరమునుబట్టి నూతనపద్ధతుల నవలంబించుటయందు వీరికి వీరే నిదర్శనము.

వీరి ప్రాయము ౪౨ సంవత్సరములు. భార్యను, నల్వురుపుత్రికలను, మమ్ములను దుఃఖసముద్రమునముంచి పరలోకమునకేగిన వీరి యాత్మకు భగవంతుడు శాంతి కలిగించుగాక!

ఇట్లు
తాతా జగన్నాథరావు
హెడ్మాష్టరు బోర్డుఎలిమెంటరీ స్కూలు, కొంత్యాం.

---

## కీ॥ శే॥ శ్రీ వేదుల అన్నయ్యశాస్త్రిగారు.

శ్రీ శాస్త్రిగారు చిన్నవయసునందే తక్కువ సర్వీసు కాలములో ఎక్కువ వృత్తి, అనుభవమును గడించి ఉపాధ్యాయలోకములో విద్యాశాఖయందెక్కువ సేవ చేయగల్గిన వారిలో నక్కరని చెప్పకయే వారి ప్రశ్నోత్తరాది ఆంధ్రరాష్ట్ర ప్రారంభ విద్య ప్రచురణల వెల్లడికాగలదు. వీరు భాషాసేవయందు అభిమానులై వీరిభావగారైన శ్రీ తాతా జగన్నాథరావు గారితో నరనారాయణ పాత్రముల వెలుగొంది ఆకస్మికముగా 9-7-43 తేదీని భార్యను, నల్గురు కుమారికలను, బంధుమిత్రాదులను వదలి పరమపథమార్గమున ప్రయాణించిరని తెలుపుట కెంతయు చింతిల్లుచుంటిని. వారికి మనశ్శాంతిని దైవమనుగ్రహించుగాక! (సింహా)

---

## హిందూపురం సెంటర్ వుపాధ్యాయ సంఘ సమావేశము, హిందూపురం.

8-7-1943 వ తేదీన పైసంఘపు సమావేశము శ్రీ T. అప్పలనరసయ్య, M. A., B. Ed., స్కూళ్ళ డిప్యూటి యిన్స్పెక్టరుగారి ఆధిపత్యమున జరిగెను. దైవప్రార్థనానంతరము ఇన్స్పెక్టరుగారు స్కూలు రికార్డులను సిద్ధపరచు సక్రమపద్ధతిని, మరియు వాటి యుపయోగములను గురించియు వివరముగా తెలిపిరి. శ్రీ M. సంజప్పగారు మొదటి తరగతికి తెలుగుపాఠమును బోధించిరి. ఈబోధన Look and Say Method ను అనుసరించి యుండెను. Teaching by Matching method సర్వోత్తమమైన పద్ధతియని తెలుపుచు ఆపద్ధతిని యిన్స్పెక్టరుగారు దృష్టాంత పటములచే మాదిరిపాఠము సలహాపేక్షలేనిది యుండవలెనని యును, అందునిమిత్తమై Preparation, Presentation, Recapitulation ఈ మూటిలో నుపాధ్యాయుడు సంసిద్ధుడుగానుండి పాఠమును బోధించుట యుత్తమని సూపర్వైజరు గారు తెలిపిరి. మరియు, మాటింగు సమయములో

వుపాధ్యాయులు చెప్పు పాఠములకు Demonstration Lesson అని పేరిడుట యుక్తమని తెలిపిరి.
పిమ్మట శ్రీ టి. గోపాలకృష్ణయ్యగారి వల్ల "బిడ్డల ఉపత్వమును బోగొట్టి, వారియందుకు దనమును వృద్ధిపఱచు వుపాధ్యాయులు" ను గుఱించి, ఒక ఉపన్యాసము చదువబడెను. అందలి విషయములు శక్కని సంస్కారమునకు లోబడియుండుట వల్ల అద్దానిని మాసపత్రికలకు ప్రచురణనిమిత్తమై పంపవచ్చునని అధ్యక్షులు సలహానిచ్చిరి.

అధ్యక్షులకు కృతజ్ఞతా పూర్వకవందన సమర్పణము, మరియు మంగళముతో నాటికార్య క్రమము సమాప్తినొందెను.

T. A. Centre, Hindupur. } N. Gundu Rao, Secretary.

---

## పోషక సంఘ సమావేశము

పార్వతీపురంఏజన్సీ మొండెంఖల్లు గ్రామములో ది 16-6-43 వ తేదీని సాయంత్రం సుమారు గం 4 30 ని||లకు మహారాజశ్రీ శ్రీకృష్ణ చంద్ర సాహుగారి (గ్రామమునసబు) అధ్యక్షత క్రింద పోషక సంఘ సమావేశము గవర్నమెంటు హిల్ స్కూలులో జరిగెను. సదరు సభకు విశ్వనాథ చౌదరీగారు (కుమారి కాపెస్టేటు శిబిస్కూల్ ఇన్స్పెక్టరు) స్కూలు ఉపాధ్యాయులు, గ్రామములోగల చాలమంది వర్తక ప్రముఖులు, వ్యవసాయదారులు హాజరయిరి. విద్య - దాని ఆవశ్యకతను గురించి సభలో చాలమంది ముచ్చటించిరి. పిమ్మట మొండెంఖల్లు గ్రామములోగల గవర్నమెంటుహిల్ స్కూలును గవర్నమెంటు హయ్యర్ ఎలిమెంటరీ స్కూలుగామార్చి 8 తరగతులవరకు విద్యగరపుటకు గల అవసరములను, అవకాశములను సభలో చర్చింపబడెను. మొండెంఖల్లు గ్రామములోగల గవర్నమెంటుహిల్ ఎలిమెంటరీస్కూలును గవర్నమెంటు హిల్ హయ్యర్ ఎలిమెంటరీస్కూలుగా మార్చుచు, రాబోవు అక్టోబరు 1943 సం|| రం నుండియే 6 వతరగతిని ప్రవేశ పెట్టగలందులకు తగినయేర్పాటులను చేయుమని ప్రభుత్వమువారిని కోరుచు సభలో సభికులచేతీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడెను. విద్యయందు గ్రామస్థులు చూపుచున్న ఉత్సాహమును కార్యదర్శి కొనియాడుచు సభికులకు అనేక వందనము లర్పించెను. పిమ్మట సభ ముగింపబడెను.

గవర్నమెంటు హిల్ స్కూలు,
మొండెంఖల్లు,
1—7—1943 }

ఇట్లు
కార్యదర్శి వేటూరి సదాసివరావు,
బి. ఎ. బి. యిడి.
హెడ్మాష్టరు.

---

## అంపాపురము

ది 24—7—43 తేదీన అంపాపురము కేంద్రోపాధ్యాయ సంఘ సభ మారేంజి సీనియర్ డిప్యూటీ ఇనస్పెక్టరు గారగు శ్రీ బి. భావనారాయణ బి. ఎ. బి. యి. డి. గారి యాజమాన్యమున జయప్రదముగ జరుపబడెను. గతసమావేశమినిట్సు చదువబడెను. సర్క్యులర్లు విశదీకరింపబడెను. యుద్ధవిషయమును గూర్చి ఉపన్యాసమొసగిరి. వార్ టెక్నిషియన్సుగా గాని, సివిలియన్ క్లర్కుగా గాని ఉపాధ్యాయులు చేరుటకు మిక్కిలి ప్రోత్సహించిరి.

వేదాన్తము - శ్రీనివాసాచార్యులు,
సెక్రటరీ

---

# ప్రకటన

రాజోలు తాలూకాలోని కొన్ని సెంటర్లనుండి, ఎన్ని పర్యాయములు నేను కోరినను సెంటరు తరఫున మెంబరును ఎన్నుకొని నేటి వరకు ఈ ఆఫీసునకు తెలుపబడి యుండలేదు. సెంటరు శక్రటరీలు గూడ ఎయిడెడ్ సంఘముపట్ల ముఖావమువహించుట శోచనీయము.

కాన వెంటనే మెంబరు లేని సెంటరునకు ఎన్నికలు జరిపి వారిపేరు విలాసము తెలుపగలందులకు సెంటరు సెక్రటరీలను ప్రార్థించుచున్నాను.

సంఘమువల్ల ఫలితమును బొందియు ఉపాధ్యాయసోదరులు నేటివరకు స్వల్పమగు సంఘచందాను చెల్లింపక పోవుట నిరుత్సాహకరము. అట్టివారు వెంటనే తమ సెంటరు మెంబరుకు చందాలు పూర్తిగా చెల్లించి భవిష్యత్ఫలితముల పొందగోరుచున్నాను.

యు. వెంకటరమణ,
శక్రటరి
రాజోలు తాలూకా ఎ. టీ. సంఘము.

---

## భీమవరం తాలూకా ఎయిడెడ్ టీచర్సు యూనియన్ సమావేశము

ఈ సంఘద్వితీయ సమావేశము ది 26—6—1943 సం॥ రం. తేదీని శ్రీ. డి. వి. సుబ్బారావు గారి అధిపత్యమున గునుపూడి శివారు రామచంద్రపురం హిందూఎలిమెంటరి స్కూలులో మధ్యాహ్నము 3 గంటలకు ప్రారంభింపబడి ఈ దిగువ తీర్మానములు తీర్మానించడమైనది.

1. ప్రస్తుతము ప్రపంచసంగ్రామముల ప్రభుత్వమువారు శత్రువులను చెండాడి అధః పాతాళమునకు త్రొక్కుచున్నందుకు యీ సభవారు మిత్రమండలివారికి ఎల్లప్పుడును విజయమును కోరుచూ తీర్మానించడమైనది.

2. ఇప్పుడిచ్చిన యుద్ధభత్యము ఎయిడెడ్ ఉపాధ్యాయునికి రు 2-0-0 చొ॥ యిచ్చినందుకు ప్రభుత్వమువారిని అభినందించుచూ సదరు అలవెన్సు చాల తక్కువగనిన్ని జి. ఒ. 159 తేదీ 2—8—42 ననుసరించియు, తరువాత జి.ఒ.ల ననుసరించియు, ప్రభుత్వము యితరఉద్యోగులకు యిచ్చిన రు 6-8-0చొ॥ ఎయిడెడ్ ఉపాధ్యాయులకుకూడ కరువుభత్యము ప్రసాదించగలందులకు యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచూ తీర్మానించడమైనది,

3. మేనేజర్లు తమ పాఠశాలలోని ఉపాధ్యాయులకు పూర్తిగ్రాంటులు యిచ్చుటకున్నూ, ప్రభుత్వము మేనేజర్లకు, బిడియిండ్లకు, అద్దెలకు, యితరకంటింజన్సీలు, వగైరాఖర్చులు ప్రసాదించ గలందులకు, కోరుచూ యీసభవారు తీర్మానించడమైనది,

4. ప్రాథమిక పాఠశాలలకు సంబంధించిన సమస్త జి. ఒ. లను ప్రొసీడింగ్సు వగైరాకాపీలను, జిల్లాలోని ప్రతితాలూకా యూనియనులకు పంపించగలందులకు శ్రీ జిల్లావిద్యా శాఖాధికారిని కోరుచూ తీర్మానించడమైనది.

5. జిల్లాలోని మునిసిపల్ బోర్డు టీచర్లకు వలెనే మాకుకూడ Time Scale యిప్పించవలసినదిగా శ్రీ డైరక్టరుదొరవారిని కోరుచూ తీర్మానించడమైనది.

6. ప్రస్తుతయుద్ధపరిస్థితులలో బజారులో ఆరువు దొరకనందున ఉపాధ్యాయులు చాలచిక్కులకు లోనగుచున్నారు కావున సెలవార్గ్రాంటు యిప్పించగలందులకు కోరుచు తీర్మానించడమైనది.

7. రైతులవద్దనుండి వసూలు చేయబడుచున్న ఎడ్యుకేషనల్ పన్ను విద్యాభివృద్ధికొరకు అన్ని పాఠశాలలకు సమానమైనహక్కుగలదు కాని ప్రత్యేకముగా డిస్ట్రిక్టు బోర్డు పాఠశాలలకే యిచ్చుచున్నారు. కాబట్టి శ్రీడైరక్టరు దొరవారు ప్రపోర్ష నేటుగా అన్నిపాఠశాలలకు యిప్పించగలందులకు యీ సభవారు ఏకగ్రీవముగా తీర్మానించడమైనది.

8. 1942 సం॥ నకు తాలూకా ఎడ్వైజరీ కమిటీవారు మాతాలూకాలో చేసిన గ్రాంట్లులను శ్రీ. డివిజనల్ యినస్పెక్టరుగారు మంజూరు చేయించగలందులకు, త్వరలో యిప్పించగలందులకు, శ్రీ డివిజనల్ యినస్పెక్టరుగారిని కోరుచు తీర్మానించడమైనది.

9. 1942 సం॥ లో దబ్బుచాలక తగ్గించిన గ్రాంటులు శ్రీ డైరక్టరుదొరవారు సప్లిమెంటుబిల్లు ప్యాసుచేయించి యిప్పించగలందులకు శ్రీడైరక్టరు దొరవారిని కోరుచూ తీర్మానించడమైనది.

10. ప్రతితాలూకాలో ఎడ్వైజరీకమిటీలలో టీచరకుగాని, టీచరు మానేజర్లకు గాని, రెండుస్థానములు ఏర్పాటు చేయించగలందులకు ప్రభుత్వమువారిని కోరుచూ తీర్మానించడమైనది.

11. సెకండరీగ్రేడు ప్యాసయిన వారు హెడ్మాష్టరుగా లేని పాఠశాలలకు హాయ్యర్ గ్రేడు ప్యాసయిన టీచరు మానేజరు నలుగురు అంతకంటె అదనముగా ఉపాధ్యాయులు పనిచేయు పాఠశాలలకు హెడ్మాష్టరుగా యుండుటకు పర్మిషన్ యిప్పించగలందులకు శ్రీ డివిజనల్ యినస్పెక్టరుగారిని కోరుచూ తీర్మానించడమైనది.

12. తాలూకాలో నిమిషన్ నాన్ మిషన్ (అనగాహిందూ) ఆయా పాఠశాలలలో పనిచేయు ఉపాధ్యాయులు గ్రేడువారీ సెంటరువారీగాను, ఆయాశంటరుల్లోను శక్రటరిగారి చిరునామాలలో తెలియచేయగలందులకు కోరుచూ తీర్మానించడమైనది.

13. భీమవరంతాలూకాలో ఆర్. సి. నెం 5076 బి 38 తేదీ 7-6-39 లో ప్యాసయిన శ్రీ డైరక్టరు దొరవారి ప్రొసీడింగ్సు ప్రకారం ప్రత్యేక బాలికాపాఠశాలలున్నచోట బాలురపాఠశాలలు బాలికలకు చేర్చరాదని ఎన్ని పాఠశాలలకు శ్రీ డిపార్టుమెంటువారు సదరు రూలు అమలు జరిపినట్లు తెలియవచ్చుచున్నది, ఇట్లు కొన్నిపాఠశాలలకు సదరురూలు అమలుజరిగించుటకు గల కారణములతో సహా ఆయాపాఠశాలలకు తెలియచేయించగలందులకు శ్రీ భీమవరంరేంజి యినస్పెక్టరుగారిని కోరుచూ యీసభవారు తీర్మానించడమైనది.

14. జిల్లాఎయిడెడ్ యూనియనుకు యీదిగువ వార్ని యీతాలూకానుండి సభ్యులుగాయుండుటకు ఏకగ్రీవముగా అంగీకరించి ఎన్నుకొనడమైనది.

1. చెరుకూరి శ్రీరామమూర్తి శక్రటరీ టీచరు మానేజరు S. R. K. P. Patasala వీరవాసరం

2. N. సుందరరావుగారు. Teacher, U L C. M. School చినపేట వీరవాసరం

15. ఈసభ మూడవ సమావేశము శ్రీ రఘురామా ఎయిడెడ్ పాఠశాల భవనమునందు జరుపుటకు తీర్మానించడమైనది. 10—7—43.

ఇట్లు,

Ch. Sree Ramamurty,

సెక్రటరీ.

భీమవరం ఎయిడెడ్ టీచర్సు యూనియన్.

6—7—43.

---

## భీమవరంతాలూకా ఎయిడెడ్ టీచర్సు యూనియన్ మూడవసమావేశము.

ఈ సంఘముయొక్క తృతీయసమావేశము 10-7-1943సం॥రం తేదీని శ్రీ D. V. Subbarao గారి ఆధిపత్యమున భీమవరం శ్రీరఘురామా హిందూయెలిమెంటరీస్కూలులో మధ్యాహ్నం 3 గంటలకు ప్రారంభింపబడి యీదిగువ తీర్మానములను తీర్మానించడమైనది.

### తీ ర్మా న ము లు

1. ప్రస్తుతము జరుగుచున్న ప్రపంచ సంగ్రామములో మన మిత్రమండలి వారికి జయము చేకూర్చుగాక అని భగవంతునిగూర్చి ప్రార్థించుచూ యీసభవారు తీర్మానించడమైనది.

2. ఉన్నత పాఠశాలలు, మధ్యమపాఠశాలలు, యున్నచోట్ల రెండు మైలులలోపుగాయున్న అన్ని పాఠశాలలకు బాలబాలికలు 4 - 5 తరగతులు ఎలిమెంటరీ పాఠశాలలలో పూర్తిగాకుండానే మధ్యమ ఉన్నత పాఠశాలలకు వెళ్లిపోవుచున్నారు కనుక అట్లు సదరు స్కూల్సుఉన్న మైలు, మైలున్నరలోపుగా యున్న పాఠశాలలకు 4 - 5 తరగతులకు ఒకటవ తరగతిలో $\frac{1}{4}$ వ వంతు ప్రవేశన్ యుండవలయునని నియమము లేకుండా చేయించగలందులకు శ్రీడైరెక్టరు దొరవారిని కోరుచూ తీర్మానించడమైనది.

3. ఎయిడెడ్ ఎలిమెంటరీ ఉపాధ్యాయ బాలబాలికలకు ఉచితముగా ఉన్నత విద్య యిప్పించ గలందులకు శ్రీడైరెక్టరు దొరవారిని కోరుచూ తీర్మానించడమైనది.

4. క్వార్టర్లుగ్రాంటులు మూడుమాసములు పూర్తియైన వెంటనే యిప్పించుచుండ గలందులకు యీ సభవారు శ్రీజిల్లా విద్యాశాఖాధికారిని కోరుచూ తీర్మానించడమైనది.

5. గుంటూరు శ్రీడివిజల్ యినస్పెక్టరువారు భీమవరంలో Camps చేసినందున వారివద్దకు ఈడిపూర్యటేసను వెళ్లుటకు, కష్టసుఖములు చెప్పుకొనుటకుతీర్మానించడమైనది.

6. హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలో 8 వ తరగతి గవర్నమెంటు పరీక్షప్యాసైన విద్యార్థులకు ఇంగ్లీషులో సాపోయినయెడల IV ఫారములో చేర్చుకొనుటకు పర్మిషన్ యిప్పించగలందులకు శ్రీ డైరెక్టరు దొరవారిని కోరడమైనది.

7. 1942 సం॥లో నలుగురు, అంతకంటె యెక్కువమందియు ఉపాధ్యాయులు పనిచేయుచోట Secondary Grade ప్యాసైన Headmaster లేని హయ్యర్ గ్రేడు ఉపాధ్యాయులకు ఎగ్జంప్షన్ యిప్పించుచూ గ్రాంటు యిప్పించవలసినదని శ్రీడివిజనల్ యినస్పెక్టరు వారిని కోరుచూ యీసభవారు తీర్మానించడమైనది.

భీమవరం
4—8—43

ఇట్లు
Ch. Sree Ramamurty
కార్యదర్శి
భీమవరం తాలూకా ఎయిడెడ్ టీచర్సు యూనియన్

---

# సభలు - తీర్మానములు

విశాఖపట్టణం, ప్రభుత్వబోధనాపాఠశాల విద్యార్థిసంఘసమావేశము (Government Training School Students Union) 1-8-1943 ఆదివారము ట్రైనింగు స్కూలు విద్యార్థి వసతిగృహమునందు (Training School Student Hostel) జరిగినది. శ్రీ ఎ. యస్. చలపతి రావుపట్నాయక్ గారు అగ్రాసనాధిపత్యమును దయతో స్వీకరించిరి. ఈ క్రింది తీర్మానములు ఏకగ్రీవముగా నంగీకరింపబడెను.

1. ప్రస్తుతము రాయలసీమయందు కరవు మిక్కుటముగా నున్నందున తత్ క్షామ నివారణార్థము కొంత చందా వసూలుచేయవలెను. ఇప్పటికి వసూలైన రు 5-0-0 లు క్షామనివారణార్థము (Famine relief fund) శ్రీ శ్రీ శ్రీ కాశీరాజావారికి పంపబడును.

2. స్టయిపెండు (Stipend) నకు తోడు రు 2-0-0 ఆయినను కరవు భత్యముల నివ్వ గలందులకు శ్రీ శ్రీ శ్రీ డైరెక్టరువారికి హెడ్మాష్టరు గారి ద్వారా తెలియజేయవలెను.

3. విద్యావిషయిక మాసపత్రికలగు ప్రారంభవిద్య, ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యలను తెప్పించు చుండవలయును.

4. ప్రస్తుతము జరుగుచున్న ప్రచండమైన ప్రపంచ సంగ్రామమునందు మిత్రమండలికి అఖండ విజయము చేకూర్చుటకును, ప్రపంచమున సత్వరశాంతి యేర్పడుటకును, భగవంతుని ప్రార్థించుటకు యీ సభవారు తీర్మానించుచున్నారు.

5. ప్రాథమిక పాఠశాలలందలి ఉపాధ్యాయులు తమకుతో చివరీతిని చందాలిచ్చుచు రాయల సీమయందలి క్షామమును నివారణ చేయుటకుందు శ్రీ శ్రీ శ్రీ విజయనగర మహారాజావారికి తోడ్పడవలసినదని "ఆంధ్ర రాష్ట్ర ప్రారంభవిద్య" పత్రికద్వారా కోరుటకును అంగీకరించిరి.

6 మొదటి రెండు తీర్మానములు. శ్రీ టి. సూర్యనారాయణరాజుగారు సభవారి ఆమోదము నిమిత్తము తేగా అవి ఏకగ్రీవముగా ఆమోదించబడెను.

ఈ సంవత్సరమునకు శ్రీ పక్కి రామమూర్తిగారిని అధ్యక్షులుగను శ్రీ ఆర్. రామకోండ గారిని కోశాధికారిగను సంఘసభ్యులు ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి

విశాఖపట్నం
తే 3—8—43.

ఇట్లు,
అరసాడ భానుమూర్తి సత్యాయశ్రా
కార్యదర్శి.
G. T. School
Vizag.

---

## • నవ్వులాలు •

ఉపా:—ఒరే రాము! "బొగ్గుపాల గడుగ" అనగా నర్థమేమిరా ?
శిష్యు:—ఏమిటండీ మాష్టరు గారూ ఆవుపాలు గేదెపాలు మేకపాలు చూచితిమిగాని బొగ్గుపాలు ఎప్పుడూ చూడలేదండీ.

ఎ. చక్రధరరావు.

---

## కృష్ణాజిల్లా ఎలిమెంటరీ టీచరుమేనేజర్లసంఘము.

పైసంఘ మహాజనసభ సమావేశము ది 4-7-'3 తేదీ ఉదయము 9 గం॥నుండి బందరు బృందావన టాకీసు సినిమా హాలులో శ్రీ చావలి సూర్యప్రకాశరావు పంతులు B.A., L.T., గారి ఆధిపత్యము క్రింద సమావేశమయ్యెను. జిల్లాలోని అన్ని తాలూకాలలో నుండి సుమారు 200 మంది ప్రతినిధులు సభకు హాజరైరి. కృష్ణాజిల్లా విద్యాశాఖాధికారిగారున్నూ, వారి పర్సనల్ అసిస్టెంటు వారున్నూ, బందరు తాలూకా డిప్యూటీ యిన్స్పెక్టరుగార్లున్నూ, మరి పెక్కురు విద్యాభిమానులున్నూ, సభ నలంకరించిరి.

పైసంఘమునకు యీదిగువ నుదహరించిన వారిని సంఘ ఉద్యోగులుగా ఎన్నుకొనిరి.

(i) Denduluri Lakshminarayana, Teacher - manager Hindu Higher Ele. School Mustabada. as President.

(ii) Chintalapati Lakshminarayana, Teacher-manager Jayalakshmi H. E. School, Bezwada, as Secretary.

(iii) D Venkateswara-Rao, Teacher - Manager, Masulipatam as asst. Secretary.

(iv) D. Giriraju, Teacher - Manager, Lingala, Gudivada Taluk as Vice - President

(v) Ch. Sivaramakrishna Rao, Teacher - Manager Kondavaram, Avanigadda Taluk as Treasurer.

తదుపరి యీదిగువ తీర్మానములు సభవారిచే ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

(1) యీ సంఘమువారు మిత్రమండలివారికి అఖండ విజయము తొందరలో చేకూరుటకు భగవంతుని ప్రార్థించుచున్నారు.

(2) యుద్ధభత్యములు రు 5/- లకు తక్కువ కాకుండ ఎయిడెడ్ స్కూళ్ళలో పనిచేయు ప్రతి టీచరునకు యిప్పించగలందులకు యీ సభవారు కోరుచున్నారు

(3) మ్యునిసిపాలిటీలోని ఎయిడెడ్ పాఠశాలలకు యింటిఅద్దెలు యిప్పింపజేయుటకు శ్రీ గవర్నమెంటువారిని యీ సభవారు కోరుచున్నారు

తదుపరి కృష్ణాజిల్లా విద్యాధికారి జనాబ్ మహమ్మద్ అబ్దుల్ అలీ సాహెబ్ బహద్దర్ వారు, యింగ్లీషున యుద్ధసంబంధమైన విషయములు బోధించుచు, యుద్ధములోనికి చేరు రిక్రూట్సుకున్న సౌకర్యములను, అట్టివారికిముందు కలుగు లాభములను, వివరించి, మిత్రమండలివారికి సహాయభూతులుగ నుండవలసినదిగా ప్రోత్సహించిరి

పై వుపన్యాసమును శ్రీ పర్సనల్ అసిస్టెంటువారు తెలుగులో తర్జుమాచేసిరి
సభ వందనములతో సాయంత్రము $5\frac{1}{2}$ ఘంటలకు ముగింపబడెను

Denduluri Lakshminarayana,
President
చింతలపాటి లక్ష్మీనారాయణ,
Secretary.

---

# విద్యావిహారము

[కాకినాడతాలూకా గ. మేడపాడు శ్రీరామా హిందూ ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు విద్యార్థులొనర్చినది.]

ది 10—7—43 తేదీని మాస్కూలు ప్రధానోపాధ్యాయులు, యమ్ యస్ యమ్ శర్మగారున్ను మాసహాయోపాధ్యాయులు విం సూ మూర్తిగారున్ను, కలిసి హైస్కూలు 3, 4, 5 తరగతుల విద్యార్థులను కాకినాడకు విద్యావిహారమునకై తీసుకొనివెళ్ళి అచ్చటిగంట స్తంభము, సముద్రతీరము, మ్యునిసిపల్ ఆఫీసు, కోర్టులు, పార్కు, గరల్సు జూబిలి ట్రయినింగుస్కూలు, అందలి కిండరు గార్డెను, మొదలగు వంశములను ఆయా అధికారుల అనుమతితో చూపినారు. ఆయా యాజమాన్యములవారు కూడా మా ఉపాధ్యాయులను, విద్యార్థులను, గౌరవించి దయతో అచట గల యంశములను యావత్తున్ను కూర్చి విద్యార్థులకు తగు ఉత్సాహముతో బోధించి ఉపాధ్యాయులకు తగు సలహాలను ఒసంగినారు ఇట్టి విద్యావిహారములు విద్యార్థులకు చాల యుపయోగకరములు ప్రస్తుత సిలబసు ననుసరించి యివి చాల అవసరములని కూడ తెలియుచున్నది

మేడపాడు
1—8—43

ఇట్లు,
యమ్. గణపతిరావు
టీచరు మేనేజరు

---

# ప్రభుత్వ వర్తమానాలు

విద్యాశాఖ

1. మద్రాసుదొరతనమువారి మ్యునిసిపల్ ఆక్టులో మ్యునిసిపల్ ఉద్యోగస్థుల యొక్కయు, నౌకరీదారులయొక్కయు, గుణార్హతలను వివరించు నిబంధనలో 3 వ అయిటము తరువాత యీ క్రింది అయిటమును చేర్చవలెను.

(4) సెకండరీస్కూళ్లలో లైబ్రేరియన్లుగా పనిచేయువారు మద్రాసు దొరతనమువారి యస్. యస్; యల్. సి. పరీక్షను పూర్తిచేసి యుండవలెను.

షరా:— ఈ నిబంధన 1943 సం॥రం 27 జూలై తేదీ తరువాత నియమింపబడువారికి మాత్రమే అనువర్తించును

2. మద్రాసు దొరతనమువారి లోకల్ బోర్డ్సు ఆక్టు ప్రకారము తదుద్యోగస్థులయొక్కయు, నౌకరీదారులయొక్కయు గుణార్హతలను వివరించు నిబంధనలో 6 వ అయిటము తరువాత యీ క్రింది అయిటమును చేర్చవలెను.

(7) సెకండరీస్కూళ్ళలో లైబ్రెరియన్లుగా పనిచేయువారు మద్రాసు దొరతనమువారి యస్. యస్ యల్. సి. పరీక్షను పూర్తిచేసి యుండవలెను.

షరా:— ఈ నిబంధన 1943 సం॥ 27 జూలై తరువాత నియమింపఁబడు వారికి మాత్రమే అనువర్తించును.

(G O. No 910, Education 2nd July 1943 )

విద్యాశాఖ

3 మద్రాసు దొరతనమువారు లోకల్ బోర్డ్సు ఆక్టుక్రింద క్రింద ఉదహరింపబడిన అన్నిసంస్థలకు అన్వయించు నిబంధనయొక్క సవరణ.

సవరణ:

18 వ నిబంధనలోని (ఎ) ఉపనిబంధన స్థానములో ఈ క్రింది మరతు చేర్చడమైనది.

"ప్రాథమిక, ఉన్నత, సంస్కృతపాఠశాలలోని ఉపాధ్యాయ సంఘములు ప్రత్యేక సంస్థలుగా పరిగణింపఁబడు నేని"

షరా:— ఈసవరణ 1941 సం॥ 3 వ సెప్టెంబరు తేదీనుండి అములులోనికి వచ్చినట్లు భావించవలసినది.

(G. O. No. 962, Education, 16th July, 1943.)

---

# సంపాదకీయము

## గ్రంథ స్వీకారము.

రచయిత. విద్వాన్

అయితం కాశీవరప్రసాదరాయకవి.

1. సులభీకృత ఛందఃకళ

2. కోదండ రామశతకము.

### సులభీకృత ఛందఃకళ.

పేరునుబట్టియే యీగ్రంథము ఛందోగ్రంథమని తెలియనగును. ఇది "బాలకళానిధి" నుండి విద్యార్థుల యుపయోగార్థము ప్రత్యేక గ్రంథముగాఁ బ్రకటింపబడినది. గ్రంథకర్తలైన శ్రీ అయితం కాశీవరప్రసాదరాయ కవిగారు సుప్రసిద్ధ భాషావేత్తలు, బహుళ గ్రంథనిర్మాతలు మధురకవిత్వరచనా ధురీణులు కాని అజ్ఞాతకవులు "Let me live unknown to the world"— అని వర్డ్సు వర్తుకవి

తల్లజూరు తన్ను గూర్చి చెప్పుకొన్నట్లు ఈ మహాకవిగూడ భాషా ప్రపంచమున కెఱుకపడకయే జీవింప దలంచెనా యేమి? వీరు బహుగ్రంథములను రచించి నప్పటికిని ముద్రితము లైనవి పైరెండు గ్రంథములు మాత్రమే! "సులభీకృత ఛందఃకళ" కవిత్వోపాసకులకు, అభ్యాసకులకు, మిక్కిలి యుపయోగకరమైన గ్రంథము కవిగారు చాలకష్టము నకోర్చి ఛందస్సునకు సంబంధించిన సమస్త విషయములను సులభగ్రాహ్యములుగ జక్కగా వివరించినారు. చాలవఱకు తమ రచనలనుండియే యుదాహరణము లం జేర్చినారు. ఆంధ్ర భాషా పరిచయము గల ప్రతివ్యక్తియు నీ గ్రంథసహాయమున దనకు దానే కవిత్వకళ నభ్యసింపవచ్చునని చెప్పనగును. ఈ గ్రంథము ముఖ్యముగా S. S L. C విద్యార్థులకును, హాయ్యరు ఎలిమెంటరీ (E S. L C) విద్యార్థులకును, ఆయా పరీక్షలకు బోధించు నుపాధ్యాయులకును, అందు ముఖ్యముగా పండిత పరీక్షలయందు తీర్ణులుగాక కేవలము యస్. యస్. యల్. సి. ట్రయినింగు పూర్తిచేసి 8 వ తరగతి పబ్లికు పరీక్షకు తెలుగుభాష గఱపు ఉపాధ్యాయులకును, చాల యుపయోగపడునని నొక్కిచెప్పుటలో నతిశయోక్తి యుండదు. దీని యుపయోగమును భాషాలోకము గురుతించునేని కవిగారి కృషి సార్థకము కాగలదు. గ్రంథము వెల రు 0-6-6 పుటలు 96.

**కోదండరామశతకము:**

ఇదియు పైకవిగారిచే రచింపబడినదే. ఈశతకము మూడుఖండములుగ విభజింపబడినది. ఒక్కొక్క ఖండమునందు 36 కందపద్యములుగలవు. ఇది కేవలము భక్తిపరము. కవిగారు కోదండరాముని ప్రార్థించు విధములు చాలపద్యములందుం గాననగును. కవిత్వము కుంటినడక లేక, వ్యర్థపదభూయిష్టము నుగాక, ధారాశుద్ధి గలిగి, కొంతవరకు సమాసజటిలతతోను, కొన్నిచోట్ల భాగవతపు బోకడలతోను, అలరారుచున్నది గ్రంథము వెల రు 0-2-6. పుటలు 40 సైజు 1/8 క్రౌను. వలయువారు.

విద్వాన్
అయితం కాశీవరప్రసాద రాయకవి,
బుచ్చిరెడ్డిపాలెము (P O.) నెల్లూరుజిల్లా
అని వ్రాసినం బడయం గలరు.

## ౨ వ్యాసకర్తలకు

వ్యాసకర్తలు, ఉపధ్యాయులు, తమ వ్యాసములనుగాని, సభాతీర్మానములను గాని, మఱేట్టివిషయములనుగాని, ప్రతినెల 5 వ తేది లోపుగా సంపాదకునకు చేరునట్లు పంపవలెను. ఈ తేదిదాటి వచ్చునవి ఆనెల సంచికలో ప్రకటింపంబడం జాలవు. ఉదా॥ కృష్ణాజిల్లా ఎలిమెంటరీ టీచరుమేనేజర్లసంఘ సమావేశము 4-7-43 తేదీన జరిగినది. ఆసభాతీర్మానములు 7-7-43 తేదిన ఏలూరుకు పోష్టుచేయుబడినవి. అవి సంపాదకునకు 16-7-43 తేదిన చేరినవి. ఇవి క్రిందటి నెలసంచికలో ప్రకటింపంబడుటయెట్లు? కాబట్టి వ్యాసములను గాని, వార్తలనుగాని, పంపువారెల్లరును "సంపాదకుడు ఆంధ్ర రాష్ట్ర ప్రారంభవిద్య నత్తెనపల్లి గుంటూరుజిల్లా" అని వ్రాసి నరాసరి సంపాదకునకే పంపిన ఆలస్యము

నకు తావుండదు. వ్యాసములు వ్రాయువారు తమ వ్యాసములు పూర్తిగా ప్రాథమికవిద్యకు చెందియుండునట్లు చూడవలెననిమనవి మఱియు వారు తమ పూర్తివిలాసమును "పేరు-ఊరు-పోష్టు-జిల్లా వివరముగా వ్యాసముచివర వ్రాసిపంపవలెను. లేకున్న పత్రికలు చేరఁజాలవు.

### ౩. శ్రీవేదుల అన్నయ్యశాస్త్రిగారి నిర్యాణము:

మా "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా" పాఠకులకెల్లరకును, విశాఖపట్టణపు జిల్లా బోర్డు ఉపాధ్యాయుల కందఱకును, శ్రీ శాస్త్రిగారు చిరపరిచయులు. వారువ్రాసిన సివిక్సు, దేశచరిత్ర, సృష్టిపరిశీలనము, భూగోళశాస్త్రము, మొదలగు ప్రశ్నోత్తరములు ఉపాధ్యాయ లోకమునకు చాల వఱకు సహాయపడిన వనుటలో సాహసము లేదు. వారు వ్రాసిన ప్రశ్నోత్తర భాగములను ప్రత్యేకగ్రంథములుగా ప్రకటించి ప్రాథమికవిద్యా ప్రపంచమున కందఁజేయవలసినదని యెందఱో యుపాధ్యాయులు మాకు వ్రాసిరి. శ్రీశాస్త్రిగారును ఈ విషయమై మాకు ప్రత్యేకముగా వ్రాసిరి. కాని కాగితము కఱవువలన మేము వారి కోర్కెను దీర్పలేకపోతిమి. ఇంతటి వైదుష్యము, అనుభవము, కలిగినట్టి శ్రీశాస్త్రిగారు తమ ముప్పదిరెండవయేట అకాల మరణమునకు గురియగుట వారి కుటుంబమునకేగాక ఉపాధ్యాయ లోకమునకును, చాల విషాదకరము. మావ్యాసకర్తలలో నొక ధీమంతుడు పడిపోయినందులకు మా విచారమును వెలిబుచ్చుచు, వారికుటుంబమునకు మా సానుభూతిని దెలుపుచున్నాము శ్రీశాస్త్రిగారి పవిత్రాత్మకు భగవంతుడు శాంతిని జేకూర్చుగాత!

ఓం తత్ సత్

—సంపాదకుఁడు.

---

1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

ఆదర్శ భూగోళశాస్త్రము

శ్రీ ఆర్. యస్. రాఘవులు B.A., L.T., గారిచే

6 - 7 - 8 తరగతులకు

వలయువారు:—రామా అండ్ కో.,

ఏలూరు - గుంటూరు - రాజమండ్రి.




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K. వెంకట్రావు B.A., L.T., గారిచే

2 - 3 - 4 - 5 తరగతులకు

వలయువారు:— రామా అండ్ కో.,

ఏలూరు - గుంటూరు - రాజమండ్రి.